శారదాగ్రంథమాలాప్రథమకుసుమము.



శ్రీరస్తు.

# నందవధము.

(నాలుగంకముల నాటకము.)

భ. చి. యజ్ఞనారాయణశర్మవిరచితము.

శారదాగ్రంథమండలివారిచేఁ

బ్రకటితము.

మాడుగుల.



| | | |
|---|---|---|
| చందాదారులకు వెల 0-3-0 | 1913 | ఇతరులకు 0-4-0 |



భ. చి. యజ్ఞనారాయణ శర్మ,
గ్రంథకర్త.

# వి జ్ఞ ప్తి.

చదువరులారా !

మా గ్రంథమాలా ప్రథమకుసుమము జూలయిలోనే వెలువడు నని ప్రకటించియున్నాము. కాని కొన్ని కారణములచే నట్లు చేయఁజాలకపోతిమి. ఇటుమీఁద నట్టియాలస్యము రాకుండ సకాలము ననే ప్రకటించుచుందుము. కావున మా చందాదారులందఱును మమ్మును మన్నింతురని నమ్ముచున్నారము.

ఈ "నందవధ" మను చిన్నినాటకము బ్ర. శ్రీ. భ. చి. యజ్ఞనారాయణశర్మగారిచే రచింపఁబడినది. ఇది చరిత్రాత్మక మయినదే కాని యచ్చటచ్చటఁ గొంతభాగము కల్పితముకూడ లేకపోలేదు. అది నాటకధర్మమే కదా! తదనుసారముగానే పాత్రములును గల్పింపఁబడినవి.

ఇందు గుణములను గ్రహించి దోషములను మాకుఁ దెలిపినచో రెండవముద్రణ మచిరకాలముననే కానున్నది గనుక నంతు సవరించుకొందుము.

మాడుగుల
ప్రమాదీచ
ఆశ్వయుజ౧౫మ

ఇట్లు
సంపాదకుఁడు:—
భ. చిరంజీవిశర్మ

# ఈనాటకమున వచ్చుపాత్రములు.

ప్రథమాంకములో:—
సూత్రధారుఁడు
మారిషుఁడు
చాణక్యుఁడు
చంద్రగుప్తుఁడు
ఇందుశర్మ
విష్ణుగుప్తుఁడు

ద్వితీయాంకములో:—
చంద్రగుప్తుఁడు
వసంతుఁడు
ప్రతీహారి
వార్తాహారి
శంభుదాసుఁడు
అంభీరుఁడు
వసంతుఁడు
సేనాని

తృతీయాంకములో:—
చంద్రగుప్తుఁడు
వేగువాఁడు
ప్రతీహారి
సెల్యూకసు
అంభీరుఁడు
గోపాలుఁడు

చతుర్థాంకములో:—
రామావధాని
పేరిశాస్త్రి
చంద్రగుప్తుఁడు
వసంతుఁడు
ప్రతీహారి
పద్మనందుఁడు
సెల్యూకసు
చాణక్యుఁడు

శ్రీ ర స్తు.

ఓం నమో మార్తాండగురుపరబ్రహ్మణే.

# నందవధము.

(ప్రస్తావన.)

ఉ. హాటకగర్భసన్నుత మహామునిసేవితపాదపద్మ
యా, రాటము మాన్చి ప్రోవవె తిరమ్ముగ
నంచితి దైన్య మేర్పడన్, బాటలగంధి భీమసుత
భక్తి భజింపఁగఁ బ్రోచునాజగ, న్నాటకసూత్ర
ధారి యదునందనుఁ డోముత మిమ్ముఁ బ్రేమ
తోన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర—మారిషా ! ఒక్కసారి యిటువచ్చెదవా ? ఎవరితో నాగ్రుద్దులాట !

మారిషుఁడు—(ప్రవేశించి) అయ్యా ! చూడండి, రాక్షసుడు లాంటివాడిని నన్నుబ్రాహ్మడెంత చిక్కు పెట్టుతున్నాఁడో !

సూత్ర—ఏమోయి నేఁ డాడఁబోవునాటకము నప్పుడే మీరే మొదలిడినారే !

మారి—నందవధ నాటకమున కేనా ? బావగారూ! ఈ నాటకము పెక్కుమంది రచియించినారు

గదా ! అందెవరుచేసినది
సూత్ర—ప్రదర్శన కనుకూ
డిన నందవధము ప్రదర్శిం
మారి—బావా ! అది రచిం
సూత్ర—నీవెక్కడనో అడవి
అటులేని వినుము.

గీ. భమిడిపాట్యాన్వయోద్భవు
డల్లమార్తాండశాస్త్రిపాద
లాత్మఁ దలఁచునతఁడు సో
సరస యజ్ఞనారాయణశర
(అటు నిటుచూచి) నంద
బడి చాణక్యుఁడు వచ్చుచున
కగపడకుండ నీదారిని బోవుద
(నిష్క్రమింత

ఇది ప్రస్తావ

---

## ప్రథమాంకము.

(రంగము - మార్గము.)

[చాణక్యుఁడు రోషకషాయితనేత్రములతో
వీడ్వడినశిరోజములతోఁ బ్రవేశించును.]

చాణ——(కోపముతో) ఔరా! నందకుమారులారా! అగ్రాసనంబుననుండునన్నుఁ గ్రింది కీడ్పించి యవమానించెదరుగా!

శా. జ్ఞాన మ్మించుక లేక యీగతిని నీచాణక్యునిన్
సత్సభన్, హీనమ్మున్ బొనరించినారె తృటిలో
నీనందవంశంబు క, య్యానంభూస్థలి కిచ్చువాఁడ
నికమీప్రాణమ్ములన్ గాచునా, భూనాథుం డెవఁ
డోకనుంగొనుఁడు మిమ్మున్ మట్టిమల్లాడెదన్.

ఓరోరీ! పద్మనందా! చండతరాఖండప్రచండభండనంబున శాత్రవశుండాలదండకాండంబులఁ గలఁగుండువెట్టి, బెండుపఱుచు దోర్దండకోదండపండితుండగు చాణక్యుండు నీగుండెపయి నుండె ననుమాట యెఱుఁగకపోతివేమిరా! నిండుభోజనకూటంబుననుండునీపాఱుండు నీ కొకభీరుండుగాఁ దట్టెఁగాఁబోలు. నందవంశీయులగునవనందులను వెనుకవైచికొని సకలజనారాధితపాదపద్ముఁ డగు వృషలుని నిందింతువేమి? నందవంశంబు నిర్వంశంబు చేయక యీ

గదా ! అందెవరుచేసినది నేఁడు ప్రదర్శింతము.
సూత్ర—ప్రదర్శన కనుకూలమగురీతిని వ్రాయఁబ
డిన నందవధము ప్రదర్శింతము.
మారి—బావా ! అది రచించినవారెవరో ?
సూత్ర—నీవెక్కడనో అడవిమృగములాగున్నావు.
అటులేని వినుము.
గీ. భమిడిపాట్యన్వయోద్భవుఁ డమలచరితుఁ
డల్లమార్తాండశాస్త్రిపాదాంబుజమ్ము
లాత్మఁ దలఁచునతఁడు సోమయాజిసుతుఁడు
సరస యజ్ఞనారాయణశర్మ సుమ్మి.
(అటు నిటుచూచి) నందులచే నవమానింపఁ
బడి చాణక్యుఁడు వచ్చుచున్నాఁడు. మన మాతని
కగపడకుండ నీదారిని బోవుదము రమ్ము.
(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

ప్రథమాంకము.

(రంగము - మార్గము.)

...ష్యుఁడు రోషకషాయితనేత్రములతో
...నశిరోజములతోఁ ప్రవేశించును.]
...(కోపముతో) ఓరా! నందకుమారులా
...గ్రాసనంబుననుండు నన్నుఁ గ్రింది కీడ్పిం
...మానిం చెదరుగా!
...లుంచుక లేక యీగతిని నీచాణక్యునిఁ
..., హీనమ్ముగఁ బొనరించినా రె తృటిలో
...ంశంబు క, య్యానంభూస్థలి కిచ్చువాఁడ
...ప్రాణమ్ములఁ గాచునా, భూనాథుం డెవఁ
...ంగొనుఁడు మిమ్ముఁ మట్టిమల్లాడెదఁ.
...పద్మనందా! చండతరాఖండప్రచండ
...శాత్రవశుండాలదండకాండంబులఁ గలఁ
...బెరుఁడుపఱుచు దోర్దండకోదండపండితుం
...న్యుండు నీగుండెపయి నుండె నసుమా
...కపోతివేమిరా! నిండుభోజనకూటంబున
...ుండు నీ కొంకభీరుండుగాఁ దట్టెఁగాఁబో
...రియులగునవనందులను వెనుకవై చికొని
...నతపాదపద్ముఁ డగు వృషలుని నిందిం
...ందవంశంబు నిర్వంశంబు చేయక యీ

చాణక్యుండు శిరోజములు ముడివెట్టఁడు సుమీ ! ఓరీ ! విష్ణుగుప్తా ! నీ వాపద్మనందుని ముద్దులబిడ్డఁడవుగా ! ఈచాణక్యుండు నీ కేయపకార మొనరించెనని వానిని దఱచుగా సేవగించుచుందువు ? మంత్రిరాక్షసుఁడు తానేమో పెద్దవిద్వాంసునివలె మీకందఱ కీదుర్బోధ బోధించియుండనోపు. మంచిది. ఇంక మీకు దిక్కెవ్వరో చూచెదఁగాక.

చ. హరిహరదేవనాథు లని నడ్డము నిల్చిన నందు
లెల్ల సత్వరమున వార్ధి డాఁగినను బౌరుషమ్ముఁ
విడనాడి, "భూసురా ! శర" ణని యన్న నేమయి
నఁజయ్యెన నందకుమారశీర్షముల్, దఱగెద నష్ట
నాహృదయతాపము తీఱెడి నిద్రపట్టెడిన్. 2

ఆహా ! కాలమాహాత్మ్యము ! వృషలుఁడు మీకతినీచుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడో ! ఆబాలుండు నిర్వక్రపరాక్రమంబున నిఖిలభూచక్రంబు నేకచక్రంబుగా నేలఁదగిన భూధవశక్రుండు కాఁడా ?

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చంద్ర—ఆహా ! కాల మెంతలో నెంతగా మాఱినది ! మౌర్యనికుమారుండనై, నూఱుగురన్నదమ్ములతోఁడఁబుట్టి తుద కన్నదమ్ముల నందఱ దిగమ్రింగి యిట్టినందులచే నవమానింపఁబడు

చున్నానా! నీచులగునందులు నన్నుఁగూడఁ జంప నుద్యమించి యిప్పట్లు నన్నొకసత్రాధికారినిగాఁ జేసిరిగా! ఏమీ జ్ఞాతివైరప్రభావము.

శా. నాతండ్రిన్ సుచరిత్రు వానిశతసంతానమ్మునున్ గూడ నీ, జ్ఞాతుల్ కారియఁబెట్టి చంపి రిఁకనన్ జంపంగనుంకించి యీ, రీతిన్ జేయుచు నున్నవారకట! దోర్వీర్యంబు చూపించుచున్, "జ్ఞాతిశ్ఛేదన లేనకి" మ్మనుటయే సత్యమ్ము చర్చింపఁగన్. 3

ఇంక నాకు దిక్కెవ్వరు? ఆర్యచాణక్యఋషినే యాశ్రయించెదను. అయ్యనఘుఁ డిట్లే పోయెఁగదా! వీరుగో! చాణక్యఋషి! (దగ్గఱకుఁ బోయిచాణక్యునిపాదములు పట్టుకొని మోఁకరించి)

ఉ. శక్యముకానిబాధ లనిశమ్మును బెట్టుచుఁ జంద్రగుప్తు భూ, మ్యైక్యము చేయ నెంచెడిదురాత్ములునందులబారినుండి మీ, వాక్యముకల్మిఁ బ్రోవుఁడు భవత్పదపద్మములన్ భజింతుఁ జా, ణక్య! మహాత్మ! మీరలె యనాథులపాలిటదిక్కుగావ రే.

చాణ—వృషలా! నీ కేమికీడు మూడినది? ధనమదాంధకారముచేఁ గన్నులు గానక యానందహతకులు నీకుఁగూడ నేమయిన హాని చేయ నెంచినారా యేమి?

చంద్ర—విప్రవరా! నాయనుజన్ములను బాతాళగృహంబునఁ బెట్టి చంపించినసంగతి తమకు విశదమేకదా! నాఁటినుండియు నన్నొకసత్రాధికారినిగా నియమించిరి. ఇప్పుడు వారు నన్నుఁదెగటార్చునుపాయం బన్వేషించుచున్నారఁట! దేవరతక్క నా కిం కెవ్వరు దిక్కు?

చాణ—ఘాతుకులారా! ఎంతపని చేయుచున్నారురా! నన్నవమానించినదియే కాక యీబాలకునిఁగూడఁ జంపయత్నించుచున్నారేమి? ఉం డుఁడుండుఁడు. తగినఫల మనుభవింపఁ జేసెదను.

చంద్ర—దేవరా! మిమ్ముల నవమానించినారా! అది యెట్లు?

చాణ—అమాత్యరాక్షసునిప్రేరణచే నానందకుమారులు నిన్ననే భోజనశాలయం దగ్రాసనంబుననుండుతఱి నొకభటునిచేన న్నాయాసనముపయినుండి క్రిందికి దిగఁద్రోయించినారు.

చంద్ర—ఆహా! చాణక్యఋష్యాగ్రహానలమునకు నందహాతకులు శలభములు కాఁగలరు.

చాణ—వత్సా! మౌర్యవంశోద్ధారకా!

చ. ఇనుఁ డుదయాద్రిఁ గ్రుంకిన సురేశుఁడు నందుల
కడ్డు నిల్చినన్, అనిలము చల్లఁబడ్డను గులాద్రు

లు గ్రుంగిన వార్ధు లెల్ల నిం, కిన నవనందులన్
రమణ గెల్చి నిన్ను జను లెల్ల హాహా యనన్,
జనపతిఁ జేసెదన్ మదిని సంశయమున్ విడుమా
కుమారకా! 5

అట్లు చేయఁజాలకపోతినేని:—

క. జడుఁడను మూఢుఁడ దుష్టుఁడఁ
గఁడు దురితాత్ముండ మిగుల ఖలుఁడను దుర్మా
ర్గుఁడ హీనుఁడఁ బాపుఁడ బాఁ
పఁడఁ గా నిఁక వేయు నేల పందన్ బందన్. 6

చంద్ర—భూసురేంద్రా! ఎట్టిపనినైనఁ జేసి జీవములు నిలిపి యుండఁగలఁడు కాని, ఆర్యచాణక్యునికోపాగ్నిని బ్రజ్వలింపఁజేసి తత్కీలల కెవ్వఁడేని నిలువనోపునా?

చాణ—వత్సా! నే నిప్పుడే నామిత్త్రుఁ డగునిందుశర్మకును, పర్వతరాజునకును వార్తల నంపి జాగరూకతగా నుండవలయు ననియెదను మాయోపాయములు చేసి యానందుల వశపఱుచుకొనవలయును. మన మిప్పటికిఁ బోవుదము.

[నిష్క్రమింతురు.]

---

ద్వితీయరంగము - సౌధము.

(చాణక్యుఁడు, ఇందుశర్మ ప్రవేశింతురు.)

చాణ—మిత్త్రమా! ఇందుశర్మా! నీనేర్పరితన మంతయు నుపయోగించి నీమాటల నెల్లఁ బద్మనందునియుంపుడుకత్తెయు విష్ణుగుప్తుఁడును నమ్మినట్లు చేసితివికదా!

ఇందు—ఇందు నా నేర్పేమి యున్నది? ఇది యంతయు నీవు పన్నినపన్నుగడయే కదా! పర్వతరా జిందు వచ్చియున్నాఁడా?

చాణ—మగధరాజ్యములో సగపా లాతని కిచ్చెద నని వాగ్దానము చేయుటచే మొన్ననే తనసేనావారముతో వచ్చి యీపురమునందు విడిసియున్నాఁడు.

ఇందు—ఈనాఁ డిచటికి రమ్మని వర్తమానముఁ బంచియున్నావా?

చాణ—ఇఁక నొకగడియలో వానిసేనలు కోటముట్టడించును. దాని కేమి గాని నిజముగా విష్ణుగుప్తుఁడు నామృతిని విని నమ్మెనేమి?

ఇందు—నమ్మినటులు చెప్పిన నమ్మకపోవునా! ఇఁక నొకగడియకు వానికిఁ జాణక్యబ్రహ్మరక్షస్సు కనిపించును. వానిజీవముల హరించును.

చాణ — ఇందుశర్మా! మురాకుమారుండు కడు మంచివాఁడుసుమీ!

చ. అని యనజంకఁ డించుకయు నార్యులఁ గొల్వఁగ నిచ్చగించు నె, మ్మనమున నన్యకాంతలనుమాత లఁగాఁగనుఁ బెద్దవారలం, దునఁగడు భక్తిప్రాయ ము కనుంగొనఁ గొంచెమయైనఁగానియూ, ఘనున కుసాటివారలుజగమ్మున లేరుతలంచిచూడఁగన్.

ఇందు — (చూచి) మిత్త్రమా! విష్ణుగుప్తుఁడు కాఁబోలును నామంత్రపరీక్షార్థమయివచ్చుచున్నాఁడు. నీ వీపెట్టెయం దణఁగి యుండుము.

చాణ — సరియే; ఆదుర్మార్గునితోఁ బద్మనందుఁడు కూడ వచ్చిన నిఁక మనవాంఛలు తుదముట్టును.

(అని పెట్టెలో దాఁగికొనును.)

(ప్రవేశించి)

విష్ణు — (తనలో) ఇందుశర్మనిజముగాభూతవైద్యుఁడే యగునా? కాఁడా? యని సంశయింపవలసి యున్నది.. కాని-చోఁ జారుమతి కన్నృత మాడవలసినంత యగత్య మేమివచ్చినది? ఓరీ! బ్రాహ్మణాధమా! చాణక్యా! చచ్చియుఁగూడమా యమ్మను బాధించుచున్నావురా! ఇందుశర్మచే జపముచేయించి నీపనిపట్టించెదనుండుము.

ఇందు—(తనలో) ఈరాకుమారుఁ డేమియో కాని యనుమానించుచున్న ట్లున్నాఁడు. క్రొత్తవింత లు మఱి రెండు చెప్పి వీనిని రజింపఁజేయవల యును. అప్పుడు కదా నేను గృతకృత్యుఁడ నగుదును.(ప్రకాశము) విష్ణుగుప్తా! నీవేమి యీా దిన మింతయాలస్యముగా వచ్చితివి? ఇప్పటికి దాదాపు రెండుయామములరాత్రి మీారి యుం డునే! ఇఁకఁ గొంచె మాలస్యముగా వచ్చిన యెడలఁ బూజ చాలించి నే నింటికిఁ బోయి యుందునే.

విష్ణు—మానాయనగారితో మాటలాడుచుండుట చే నింతాలస్య మయినది. కాని మాయమ్మగా రిబాధ యించుకయుఁ దగ్గలేదుసుఁడీ!

ఇందు—ఏమీా! యింకను నామెబాధ తగ్గుటయే లేదా! కానిమ్ము:—

చ. ఘనతరమంత్రరాజము లఖండముగాఁ బఠియింతు నేని భూ, మిని గలసర్వభూతములు మేను దొ రంగు నహో మదాజ్ఞ భూ, తనిచయ మెల్ల వ ర్తి లువిధమ్ము నెఱుంగవె లిప్తలోన నేఁ, బనిగొని బాగుచేసెద సెబా సనిమెత్తువు నీవు నెమ్మదిన్.

రా—ఇందుశర్మా! నీ వట్టివాఁడవే. కా వని నేను

జెప్పఁగలనా ? అందుల కయియే కదా నిన్నిం
తగొప్పగాఁ జూచుచుంటిమి. మునుపటికన్నఁ
గొంచెము నెమ్మదిగా నున్నది. కాని నిశ్శేషము
గాఁ బోలేదు.

ఇందు — విష్ణుగుప్తా ! నామంత్రము పరీక్షింపనెంతు
వేని : —

గీ. ఎవఁడు భాధింపుచుండె మి మ్మిన్నినాళ్ళు
ఎవఁడు మీవంశమును మాప నెంచుచుండు
నెవని మౌర్యుఁడు గొప్పగా నెంచుచుండు
వానిఁ జాణక్యుఁ జూపింతు వలయునేని. 9

నాఁటిదినమ్మున మృతినొంది మీయమ్మ నింత
గా బాధింపుచుండిన చాణక్యబ్రహ్మరక్షస్సు నిపుడు
చూడ నెంచెదవేని చూపించెదను.

విష్ణు — (తనలో) బాగుగ నున్నది. ఆచాణక్యహత
కునిరూపము నాకుఁ జూడ నిచ్ఛ లేకున్నను
వీనిమంత్రపరీక్షార్థమయి తప్పక చూచెదఁగాక.
చాణక్యరూపము నితఁడు చూపింపఁ గలుగు
నేని మంచి మాంత్రికుఁడే. (ప్రకాశము) ఇందు
శర్మా ! ఏదీ చూపుము.

ఇందు — సరియే నీవుచూపుమనినట్లే చూపెదను. నీ
వుమాత్రము భయమునొందక యావంకఁజూచు

చుండుము. (మంత్రించుటనటించి) ఓచాణక్య బ్రహ్మరాక్షసా! మాయాజ్ఞానుసారముగా నీవీ పేటికయం దుద్భవించి మా కగపడుము.

(చాణక్యుఁడు లేచి నిలుచును.)

విష్ణు—ఓసీ! బ్రాహ్మణాధమా! చచ్చియు మమ్ముల సాధించుచున్నావుగా! ఇంకనైనను మాయమ్మను వదలిపెట్టెదవా? లేనిచో నిన్ను భూస్థాపన చేయించెదను.

ఇందు—విష్ణుగుప్తా! నాయాజ్ఞానుసారముగానిందుఁ బ్రత్యక్షమయినగ్రహమును నీవు నిందింపకుము. ఈవినోదము చూడుము. ఓగ్రహమా! నాయనుమతిని నీవు మాట్లాడుము.

చాణ—నందవంశ మంతరించువఱకును నే నిశిరోజముల ముడివెట్టను. ఖడ్గమును విడువను.

విష్ణు—అబ్బా! ఘాతుకుఁడా! చచ్చియు ఖడ్గము విడువవేమి? నిన్ను మరలఁ జంపుచున్నానురా!

(నఱుకఁబోవును.)

చాణ—(తప్పించుకొని) నన్నుఁ బరిమార్చెదవేమి? ఎప్పుడు నీకుఁ జాణక్యగ్రహ మగపడినదో అప్పుడే నీవు లేనివాఁడ వయితివి.

మ. చపలత్వమ్మున నింద కొల్పిన ననుఙ్ సంప్రీతిఁ

బోఁదోలుటో, కపటామాత్యునిమాటలన్ వినుచునన్ ఖండింప నుంకించుటో, నిపుణత్వమ్మును జూపి మౌర్యులను బంధింపించి చంపించుటో, కపటాత్మా! నినుఁ జంపుచుంటి నిదె నిన్ గాపాడువాఁ డేఁడిరా. 8

విష్ణు—ఇందుశర్మా! ఈబ్రహ్మరక్షస్సు నీపాటి మాయముచేయుము.

చాణ—దైవమును స్మరించుకొనుము. చచ్చుటకు సంసిద్ధముగ నుండుము.

(అని పొడిచివేయును. తెరలోఁ గలకలము.)

ఇందు—మిత్త్రమా! మనము కృతకృత్యుల మయితిమి? —ఏమీ యీకలకలము!

చాణ—పర్వతరాజు కాఁబోలును గోటలోఁ బ్రవేశించినాఁడు రమ్ము. మనము వానిని గలసికొందము. (నిష్క్రమింతురు.)

# నందవధము.

## ద్వితీయాంకము.

---

(ప్రథమరంగము - శతద్రూనదీప్రాంతారణ్యస్థ నూత్నసౌధము.)

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చంద్ర — ఆర్యచాణక్యునియనుగ్రహముచే నే నానందులవాతఁ బడకుండఁ దప్పించుకోఁగలిగితిని. ఆహా ! ఏమాచాణక్యునిబుద్ధి విశేషము. రాక్షసామాత్యునిమాయోపాయంబులఁ జిక్కకుండ నన్నుఁగాపాడె. కపటోపాయంబులు పన్ని మహాపద్మనందునిసంతతినెల్లఁ జంపివైచెను. అర్ధరాజ్యమిచ్చెద నని నమ్మించి పర్వతరాజును బిలిచి వానిసహాయంబునఁ బద్మనందుని నందకటకమునకుఁ బాఱిపోవునట్లు చేసెను. నూతనదుర్గనిర్మాణమునకయి న న్నీయరణ్యప్రాంతమునకంపి చాలఁగాలమాయె. ఇంకను వారియొద్దనుండి యొకజాబైన రాకుండుట కడు శోచనీయము — వేఁటకుఁబోయి మనవసంతుఁ డింకను రాలేదు. కారణ మేమయి యుండునో ?

[ప్రవేశము వసంతుఁడు, ప్రతీహారి.]

ప్రతీ—జయముజయము చంద్రగుప్త సార్వభౌమా!

చంద్ర—మిత్త్రిమా! కూర్చుండుము:—ఓయీ! నీవు చాణక్యఋషియొద్దనుండి యేమయిన సందేశంబు కొనితెచ్చియున్నావా?

ప్రతీ—చిత్తము.

వసం—సఖా! పర్వతకునిసంగతి నీకేమయినఁ దెలిసినదా!

చంద్ర—లేదు లేదు చెప్పుము.

వసం—రాక్షసామాత్యుఁడు చాణక్యుని జంపనెంచి పానియండ కొకవిషకన్యను బంపించెను. చాణక్యఋషి యది యెఱింగి, యాకన్నెను బర్వతకునియొద్ద కంపెను. మంత్రిరాక్షసుఁడే తనయొద్ద కాకన్యకను బంపెనని తలంచెను గాని యీగుట్టుంగ లేకపోయెనఁట. తత్సంయోగమున విషము తలకెక్కి పర్వతకుఁడే ప్రాణములవిడిచెను. అర్ధరాజ్య మీయవలసినచిక్కు లేకుండ నీయుపాయము పన్నెనఁట!

చంద్ర—వహ్వా! ఏమాయుక్తిచాతుర్యము. వసంతా! నీ వాలేఖ నందుకొని చదువుము.

వసం—(లేఖవిప్పి) ధీరాగ్రేసరా! మురాకుమారా!

నీదుర్గం బవిఘ్నంబుగ సంపూర్తి చెందినదని విని మిగుల సంతసించితి. పద్మనందుండిపుడు నందక టకమందున్నాఁడు. పర్వతునిమాయోపాయము చేఁ గడతేర్చితి. గ్రీకునాయకుండగు సెల్యూక సును, తక్షశిలాధిపతియగు నంభీరుఁడును బద్మనం దునకు సాహాయ్య మొనరించునట్లు తెలియ వచ్చుచున్నది. వెంటనే నీపరివారముతోఁ బోయి అంభీరునోడించి తక్షశిలను స్వాధీనపఱుచుకొను ము. నే నిచట నందవధోద్యోగమునకుఁ దగు ప్రయత్నములపయి నున్నాఁడను.

పాటలీపుత్రము } చాణక్యుఁడు.
కార్తీకబలులు }

చంద్ర—మిత్రమా! వసంతా! వింటివికదా! ఆ ర్యచాణక్యనివ్రాఁతలు. మన మిప్పుడొనరింపవ లసినయత్నము లెయ్యవి?

వసం—సఖా! వెంటనే తక్షశిల ముట్టడింపవల యును.

చంద్ర—సంగడీఁడా! నీపలుకులు కడు మాన్యార్హ ములు. మనయొద్దనున్న యిరువదివేల పదాతివ ర్గము, మూఁడువేలపౌఁజు, అయిదువందలేనుం గులు నేఁడు గాఁబోవుకయ్యమునకుఁ జాలునా?

వసం—చాలకేమి? ఆర్యచాణక్యఋష్యాశీర్వచన ప్రభావపరంపర మనపయినుండునపు డింతసైన్యముసయితమనవసరము.

చంద్ర—ఓయీ! ప్రతీహారీ! చాణక్యఋషి సుఖయయియున్నాఁడా? అచట మఱియేమయిన విశేషము కలదా!

ప్రతీ—దేవా! సుఖముగా నున్నారు. అం దేమివింతలున్నవి.

చంద్ర—మగధరాజ్య మిప్పు డరాజకముగా నున్నదికాఁబోలును?

ప్రతీ—దేవరా! అరాజక మేటి కగును? ఆర్యచాణక్యఋషియే దానిని బరిపాలించుచున్నారు.

శంభు—(ప్రవేశించి) దేవా! జయముజయము.

చంద్ర—ఓరీ! విశేషము లెవ్వియైనఁ గలవా?

శంభు—దేవా! గ్రీకుసేనాసాగర ముప్పొంగి చంద్రగుప్తుఁ డనుచెలియలికట్ట నతిక్రమింప నుద్యమించుచున్నది.

వసం—ఏమేమీ! గ్రీకులు మనపయి దండెత్తి వచ్చుచున్నారా?

చంద్ర—మిత్త్రమా! వసంతా! వింటివికదా! శంభుదాసునిపల్కులు.

ఉ. వైశమునూని తక్షశిలపైఁజను మంచును వ్రాసి పంపె ధీ, శాలి గురుండు గ్రీకు లతిచండతరోద్ధతి వచ్చుచుండి రం,చాలము తప్పదంచు నిపు డాతఁడు చెప్పుచునుండె వింటె యే,లీలనుజేయ నేమగునో లిప్త గతించిన నేమి యానొకో ? 9

(ఇప్పట్ల నాకేమియుందోఁచకుండనున్నది.)

వసం—మిత్రమా ! దీనికయి యింతగానాలోచింప నేటికి ? నే నీదుర్గంబు సహస్రపదాతివర్గంబుతోడను, పంచశతవాజివర్గంబుతోడను, ఏఁబదేనుంగులతోడను నప్రమత్తుండనై సంరక్షించుచుండెదను. మిగిలిన బలంబుతో నీ వార్యచాణక్యునివాక్పరిపాలనార్థము నేఁడే తక్షశిలాధిపతియగు నంభీరునిపయి దండువెడలి వాని నోడింపుము. ఈదుర్గరక్షణార్థము నీవు భయపడ నవసరము లేదు.

చంద్ర—సఖా ! వసంతా ! నే మిగుల సంతసించితిని. నేఁడే యార్యచాణక్యునియాజ్ఞానుసారముగ నేఁబోయి తక్షశిల ముట్టడించెదను. నీ వీదుర్గంబు గడుజాగరూకతతో రక్షించుచుండుము. గ్రీకులు యుద్ధమందుఁ గడు నారితేఱినవారుసుమా !

వసం—సంగడీఁడా! నీవావిషయమై చెప్పనక్కఱలేదు.

ఉ. గ్రీకులె కాదు కేశవుఁడు కేలను జక్రము దాల్చి
వచ్చినన్, వీఁక నెదిర్చి యడ్డముగ నిల్చెద గెల్చె
ద వారినెల్ల దు, ర్భీకులు గ్రీకు లన్న "భళిరే !
నిను మెచ్చితి మేలు మేల్ వసం, తా ! కడుసం
తసించితి" ననంగిజయంబు వహించిమించెదన్.

వేగులవాఁడు—(ప్రవేశించి) జయము జయము మహారాజా ! కాశ్మీరాధిపతి తన సేనావారమంత యుయుద్ధమునకు సన్నద్ధంబు చేయుచున్నాఁడు. అతఁ డెవ్వరిపయి దండు వెడలునో తెలియ రాకున్నది. దేవరయే నిర్ణయింపవలయును.

వసం—మిత్రమా ! కాశ్మీరాధిపతి మనకు మిత్రుండుకదా ! గ్రీకులు మనపయి దండెత్తనుంచుట విని మనకు సహాయము చేయవచ్చునని యిట్లు చేయుచుండెనని తోఁచుచున్నది. ఇంక నీవు నిస్సంశయముగాఁ దక్షశిల కరుగవచ్చును.

చంద్ర—వసంతా ! నీయూహ కడు శ్లాఘనీయము. నేఁడే తక్షశిల కేఁగెదను.

వసం—సఖా ! సేనలెట్లున్నవో మనముపోయి స్వయముగాఁ జూచి వత్తమురమ్ము.

(నిష్క్రమింతురు.)

---

రంగము—తక్షశిల.

[అంభీరుఁడు ప్రవేశించును.]

అంభీ—అక్కటా! ఇన్నినాళ్లుబ్రదికియింటికావలఁజచ్చె
ననినట్లు నేనీచంద్రగుప్తునిచే నోడింపఁబడితినా!

ఉ. ఆలములోన శాత్రవచయమ్ముల నోరిచి బెంపు
చేసిదో, శ్శాలియితండటంచును బ్రజల్ నుతియిం
పఁగఁ బేరుగాంచి యీ, బాలిశమౌర్యవంశజుఁడు
పాతకి భీరుఁడు చంద్రగుప్తచం, డాలునిచేత నో
టువడినాఁడను గాలవశమ్ముచే నహా! 11

మ. కులమావన్నెకుఁదగ్గె నీహృదయమా క్షోభించె
నాభీలదో, ర్బలమా రూపఱె రాజ్యమా తుదకు
సంగ్రామంబులోఁబోయె వ్యా,కులభావంబు ఘ
టిల్లె నేనొకఁడనే క్షుద్బాధచేగ్రమ్మగ్గి గ్రీ,కులపాదం
బులఁ బట్టఁగావలసె నాకుఁ దిక్కు వారేకదా!

మహాపద్మనందుఁడుకూడఁజంద్రగుప్తునకు శత్రు
వేకదా! ఇంక నేఁ గ్రచ్ఛుఅపోయి ముందాపద్మనం
దుని గలసికొనియెదను. పిదప మేమిరువురమును గ్రీ
కులతోడ సంధియొనరించుకొని చంద్రగుప్తుని బరి
మార్పవచ్చును.

గీ. రహిని బాండవుల్ దన్నుఁ బరాభవింపఁ
దత్పరాభవమునకు డెందమునఁ గనలి

హరుని ఒపియించి కృతకృత్యుఁడైనసింధు
పతియటులె వీనిఁ బరిమార్చువాఁడ నిజము. 13

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! జయము జయము. చంద్రగుప్తుఁడు నిరభ్యంతరముగా నంతఃపురంబుఁ బ్రవేశించి, యవరోధజనంబునెల్ల బయటికిఁ బో నిచ్చుగల్గినఁ బొమ్మని యాజ్ఞాపించుచున్నాఁడు.

అంభీ—అక్కటా! అంభీరుని రాణివాసమున కెట్టిచేటుమూడినది? ఆఖలుఁడవరోధజనమ్మునకు మానహాని చేయునేమోకదా!

ప్రతీ—దేవా! రాణివాసమును మాతృసమానముగాను, ప్రజలను ప్రజలవలెను నాచంద్రగుప్తుఁడాలోచించుచున్నాఁడఁట.

అంభీ—ఓరీ! నీవుపోయి దేవిని మీయింట దాచియుంచుము. పిమ్మటఁ గర్తవ్య మాలోచించికొనవచ్చును—అక్కటా!

సీ. హంసతూలికలపై న త్తమిల్లెడిబాల
భూశయ్యపై నిద్రపోవు టెట్లొ
పట్టుబట్టలు మేనఁ గట్టఁ గందెడిగోల
కాషాయిగుడ్డలఁ గట్టుటెట్లొ
అంతఃపురమ్మునం దడుగిడురామ యి
ప్పుడు కర్కశావనిఁ నడచుటెట్లొ

ఇనునికన్నె యుఁగ కింటను మెలఁగెడిభామ
యెండవానలకు సహించుకెట్లొ
గీ. చెలులు దాస్యమొనర్పఁగాఁ జెలఁగుచామ
ఊడిగము లేక యిక్కట్ల కోర్చు టెట్లొ
కుదురుగా ధాత వ్రాసిననుదుటివ్రాలు
తప్పఁజేయఁగఁ దరమె మాధవునికైన. 14

ఆహా! ఇంక నేనేమిచేయుదును. రాజ్యంబుగో ల్పోయి పూజ్యంబుదక్కి, శౌర్యంబు లేక యనివా ర్యంబగు దుఃఖసాగరంబునఁబడి తెన్నుగానక యి ట్లుండు మని నలువ వ్రాసెఁ గాఁబోలును.—

కానిమ్ము. ముందు గ్రీకుపతియగు సెల్యూకసుద రికి నే నేఁగెదను.

వార్తాహారి—(ప్రవేశించి) దేవా! అంభీరమహారా జా! గ్రీకునాయకుఁడు తమకు సహాయార్థము గా నిచ్చుటకై వచ్చియున్నాఁడు.

అంభీ—సంతోషము. సంతోషము. ఆడఁబోయిన తీర్థమెదురైనది. మనము వారిసన్నిధికేఁగి యీ కోట ముట్టడించుటకుఁ దగినసన్నాహములపై నుందము. గ్రీకులు మనకు సహాయము చేసిన దులకై శతద్రూనదీప్రాంతమంతయు వారలకీ యవచ్చును.

వార్తా—మహారాజా! జాగొనరింప వీలులేదు. మన మీపనినంతయు రహస్యముగాఁ జేయవలయునుగదా!

అంభీ—అవును. విజయోత్సాహముచేఁ గన్నుగానక చంద్రగుప్తుం డప్రమత్తుండై దుర్గంబుననున్నాఁడుకదా! మన మీరాత్రి రహస్యముగాఁ గోటముట్టడించిన వాఁడు తప్పక మనకు స్వాధీనమగును.

గీ. గ్రీకుపతిసఖ్యమునఁ జేసి వీఁకఁ జంద్ర
గుప్తు నెదిరించి కోట గగ్గోలుపెట్టి
పిండి నొనరించి వానిని బెండుపఱిచి
తత్క్షణము చేకొనఁగవలెఁ దక్షశిలను. 15

కావున మనము సత్వరంబ గ్రీకులతో సఖ్యంబుచేసికొందము. వారెందున్నారు? ఎంతమందివచ్చినారు?

వార్తా—దేవా! నేలయీనినట్లు గ్రీకులువచ్చి దేవరవారియుద్యానవనసీమను విడిసినారు. వారిని గాంచినచో నెట్టివారికయిన భయముజనింపకమానదు. వారిబలములు వచ్చునప్పుడు క్రమ్మిన కెందూళులు నింగిముట్టి యెఱ్ఱనిసంధ్యాకాలచిహ్నము లుదయింపఁజేసినవి. సుమారు నలువదివేలబల ముండునని తోఁచుచున్నది. రండు మన మటకేఁగుదము.

అంభీ—సరియే ! వారుండుప్రాంతమునకు నీవు దారితీయుము, ముందుగా నీవు పోయి నాయాగమనంబు గ్రీకుపతికిఁ దెల్పుము.

(నిష్క్రమింతురు.)

---

రంగము—చంద్రగుప్తదుర్గము.

(వసంతుఁడు, సేనాని ప్రవేశింతురు.)

వసం—ఆహా ! ఏమిది ! నేఁటరేపట గ్రీకుసేనలు మాపయి వచ్చునని వినియుంటినిగదా ! ఇంకను రాలేదేమి ?

చ. ఇదె యరుదెంచె నంచు నవు డాతఁడు చెప్పెను వారురారు నా,మదినిజనించె నిప్డు డనుమానము మిత్తుని కెద్దియేనియా,పదఘటియింపఁ దక్షశిల పైఁజనినారొకో? గ్రీకువార లి,య్యది యనృతంబొ యెట్లు తెలియఁగావలె నేమియొనర్తు నిచ్చటన్.

ఉ. గ్రీకులు వచ్చువా రని పురిన్ గనిపెట్టుక యుందె యుందునా, గ్రీకులు రారటంచనుచు బురిన్ విడనాడుచు నందుఁబోదునా,అకడ కేఁగ నేమగునొ యక్కట యిక్కడఁ జిక్కియున్న నే, మోకద యేమి చేయుదు నయో యిటునూయటుగోయియాఁగదా !

నాఁటినుండియు నాకించుకయేని వార్తదెలియరా కున్నది. నామిత్త్రుఁడు తక్షశిల జయించినవర్తమాన ముకూడఁ దెలియకున్నదే? వార్తలు దెలిసికొనిరమ్మ ని పంపినవార్తాహారియు రాలేదు. కారణ మేమయి యుండునో?

వార్తాహారి—(ప్రవేశించి) దేవా! జయము జయ ము. దేవరయాజ్ఞానుసారముగాఁ దక్షశిలాప్రాం తమునకుఁ బోయి విశేషములఁ దెలిసికొని వచ్చితిని.

వసం—ఓరీ! విశేషములేమి? ప్రభువులకు సేమ మేకదా!

వార్తా—దేవా! విశేషముల కేమిఁగొదువ! మనప్రభు వు తక్షశిల ముట్టడించి, అంభీరు నోడించి పాఱఁ దోలెను. ఎక్కడనుండి వచ్చిరోకాని గ్రీకులువ చ్చి పురము ముట్టడించిరి. కాశ్మీరాధిపతియగు రాయమల్లుఁడు మనకు సహాయపడునని తెలియ వచ్చినది. కాని యాతఁ డెందును గానరాఁడు.

వసం—ఏమిది? చంద్రగుప్తుఁ డప్రమత్తుండై యుండి నను గ్రీకులువచ్చి తక్షశిలను ముట్టడించిరా! అట్లయిన వారు చంద్రగుప్తదుర్గమునకు రారను మాట నిశ్చయమేకదా? అంభీరుఁడు తప్పించు

కొని పాఱిపోయి గ్రీకుల శరణుఁజొచ్చి యిట్లా నరించియుండనోపు. మంచిది. నేనుగూఢ సఖున కు సహాయ మేఁగెదను—సేనానీ!

సేనా—చిత్తము.

వసం—నీ వీదుర్గముతలుపుల మూయించి యెల్లప్పు డప్రమత్తుండ వయి కాచుచుండుము. తలుపులు మాత్రము తెఱవకుఁడు.

సేనా—దేవా! తమయాజ్ఞానుసారము తప్పక నిర్వర్తిం చెదను. కొంచెము సైనికుల నిటనుంచినఁ జాలు ను. అట జరుగువిశేషము లన్నియుఁ దమరు మా కు వార్త లంపించుచుండుఁడు.

వసం—అటులనే చేసెదనులే. సమరరంగంబున నల సియున్న మన్మిత్రునిపయికి గ్రీకులు సమయము కనిపెట్టి వచ్చినారా?

గీ. దండిశత్రులగుండియల్ పిండిచేసి
బెండువడఁజేసి మొన గలగుండువెట్టి
చండదోర్దండకోదండపండితుండు
నగువసంతుండు కలఁడంచు నగపఱిచెద. 18

సేనానీ! నీవు ప్రియాణభేరి మ్రోఁగింపఁజేయు ము. నేనును నాయిలవేల్పగు గురునాథస్వామిని ద లంచి ప్రయాణసన్నద్ధుండనయి వచ్చెదను.

సేనా—దేవరయాజ్ఞ శిరసావహింపఁబడినది.

(అందఱును నిష్క్రమింతురు.)

(తెరదిగును.)

---

# న ం ద వ ధ ము.

## తృతీయాంకము.

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చంద్ర—ఆహా! ఏమి యీవిచిత్రము?

గీ. నిన్నసూర్యాస్తమయమున నేను జూడ
మందునకు నైన వీరుఁ డిందొందు లేఁడు
ఉదయమున లేచిచూడనోహో! యిదేమొ
దండుతో నిండియుండె భూమండలంబు.— 19

ఇవి యెవరిసేనలయి యుండునోకదా! గ్రీకులు పోయి చంద్రగుప్తదుర్గముముట్టడించెదరని వినియుంటినే! వారేవీరయియుందురా? వారికి నేను దక్షశిలముట్టడించినవిషయ మేల దెలియును. వారు తప్పక చంద్రగుప్తదుర్గముననే పోయియుందురు. అట్లైన వీరెవరు? మహాపద్మనందుఁ డంభీరునకు సహాయమువచ్చెనా? అట్లే అయియుండనోపు.—ఆఁ—వానికింతసైన్య మెట్లు వచ్చును? కాశ్మీరరాజు నాకు సహాయార్థము

వచ్చునని నాఁ డనుకొంటిమికదా:— అట్లయినఁ
దావచ్చినట్లు వర్తమాన మేల పంపించకుండును?
గీ. శత్రువులటంచు నెంతునా! మిత్రులంచు
నెంతునా! యెట్టులూహింపనేమి యగునో?
నూయి యొకవంక యొకవంక గోయి యన్న
యట్లు గన్పట్టుచుండె నిప్పట్లనాకు.—
ఇంతకును నేను బంపినవేగులవాండ్రింకను రా
లేదు. వారుకూడ వచ్చువేళ యయినది.
వేగువాడు—(ప్రవేశించి) దేవా! జయము జయము.
చంద్ర— ఓరీ! విశేషములేమి? ఈసేనలెవ్వరివి?
వేగు—దేవా! ఇంకేమున్నది.—
సీ. కటుకుకత్తులఁ బూని యొఱలను దూసి చ
క్కగ సానఁబట్టింపఁ గడఁగువారు
కుంతమ్ములకు వింతవింతకాంతులు గల్గ
గోముగా వానిని దోమువారు
వారువమ్ముల బారుతీఱిచి గుగ్గిళ్ళ
వెస వాని కెల్లను వేయువారు
గజబృందముల నెల్లఁగడఁగి సింగారించి
వడి నాజికిని సిద్ధపడెడివారు
గీ. సేనలను హెచ్చరించి సంసిద్ధులగుఁడు
బవరమున కంచు నుత్సాహపఱుచువారు

వారువీరన నేల యుం దారయంగ
నేలయీానినరీతిని నిండె దండు—
దేవా ! తమరింకఁ గర్తవ్య మాలోచింపుఁడు.
చంద్ర—ఓరీ! ఆదం డెవ్వరిదో తెలిసికొనివచ్చితివా?
అం దెవ్వ రెవ్వరున్నారు.—
వేగు—దేవరా ! అందుఁగలవారా !
గీ. పాఱిపోయినభీరుఁ డంభీరుఁ డొకఁడు
వానికి సహాయపడ నిందు వచ్చినట్టి
గ్రీకుపతియైన యల్లసెల్యూకసాకఁడుఁ
గూడ నున్నారు దానిలోఁ గువలయేశ.— 22
చంద్ర—గ్రీకులు చంద్రగుప్తదుర్గమును ముట్టడింతురని మన కప్పుడు తెలియవచ్చినదికదా! ఆకస్మికముగాఁ దక్షశిలపయి కెట్లువచ్చిరో తెలియరాకున్నదే? పాఱుఁబోతంభీరుఁడుకూడ వారిలోఁ జేరి యీాపనికిఁ బ్రోత్సాహకారకుఁడై యుండియుండును. ఓరీ ! వారిబల మేమాత్ర ముండును?
ఇం కేమయిన నీవు తెలిసికొని వచ్చితివా?
వేగు—దేవా ! వారిబల మఱువదివేలుండునట్లు తోఁచుచున్నది. ఇంక వేగున కేమియున్నది? కాశ్మీరాధిపతి రాయమల్లుఁడుకూడఁ దాను నలువదివేల బలముతో బయలువెడలి వచ్చుచు

న్నాఁడని తెలియవచ్చినది. అతఁడుకూడ నిచ్చటికే వచ్చుచున్నాఁడఁట! మనకుసహాయపడునో, లేక గ్రీకులకేసహాయ మొనరించునో తెలియరాకున్నది.

ప్రతీహారి—(ప్రవేశించి)జయము జయము చంద్రగుప్తసార్వభౌమా! నలువదివేలకాల్బలంబుతోఁ గూడి కాశ్మీరాధిపతియగు రాయమల్లుఁడు రహస్యముగా వచ్చి పాణిద్వారము నొద్దఁగల మామిడితోఁపులో విడియించియున్నాఁడు. తాము వచ్చినట్లు గ్రీకులకుఁ దెలియకుండఁ గోటలోఁ బ్రవేశించి దేవరకుసహాయముచేయుటయే వారియుద్దేశము. వారు ద్వారంబు రహస్యంబుగాఁ దెఱపింపుమని తమతో మనవిఁ జేయుమనినారు.

చంద్ర—ఓరీ! నీ వెవఁడవు. అనేకరక్షకభటసంచయములచే సంరక్షింపఁబడుచున్నకోటలోని కెల్లెవ్వరికిఁ దెలియకుండఁ బ్రవేశింపఁ గలిగితివి? వారియొద్దనుండి యేమయినఁగమ్మగానీ తెచ్చితివా?

ప్రతీ—దేవా! తమతో రహస్య మతిజరుగురుగా నివేదింపవలయు నని చెప్ప మీభటుఁడే నన్నుఁదోడ్కొని మీయొద్దకువచ్చినాఁడు. ఇదే వారు తమకులిఖించి పంపినకమ్మ తిలకింపుఁడు.

చంద్రి—ఇదియా! మామిత్రుఁడగు రాయమల్లుఁడు వ్రాసినది.

(చదువుచున్నాఁడు.)

“చంద్రగుప్తసార్వభౌమా! హిందూదేశకాంతాలలామముఖమ్మునకుఁ దిలకాయమానుండవగు నీకెన్నటికైన సహాయము చేయవలయునని చిరకాలమునుండి తఱివేచి యుంటిని. శతద్రూనదీ ప్రాంతమందునఁ గల నీచంద్రగుప్తదుర్గము గ్రీకులాక్రమింప నెంచుట విని నీకు సహాయము చేయ నిశ్చయించి నాసేనలసిద్ధపఱిచితిని. వేగులవాండ్రచే గ్రీకులప్రయాణమంతయుఁ గనిపెట్టించి వారితోఁ గూడనే బయలుదేఱి వారికిఁ దెలియకుండ వారి వెనుకనే వచ్చుచుంటిని. నీవు తక్షశిల స్వాధీనపఱచి కొనినసంగతి వారు విని ముందు నిన్నిట నోడింపనుద్యమించి యిచ్చటనే విడిసిరి. వారికిఁ దెలియకుండ నేనువచ్చి మామిడితోఁపులో నాసైన్యములతో నున్నాఁడ! నీవొక్కఁడవే యిందున్నావని యెంచి వారు నిర్భయముగఁ దక్షశిల ముట్టడించినయెడల మన మిర్వురముగలిసి వారినిందోడింపవచ్చును. ప్రొద్దెక్కిన కొలఁది నేనిచ్చటనే యున్నవారల కగపడుదును. కాన రహస్యముగా నీపాంశిద్వారము దెలుపించినచో

నా సేనలతోఁ లోనఁ బ్రవేశింతును. పిదపఁ గర్తవ్య మాలోచించుకొందము."

తక్షశిల } రాయమల్లుఁడు.
మార్గశీర్షశు౹౹౩లు }

చంద్ర—(తనలో) రాయమల్లుఁ డీవఱకే వచ్చుచున్నాఁడని వినియున్నాము. ఈతఁడు నిజముగా మాకుపకారియే యనుటకు సందియములేదు. కాని, యీప్రతీహారిని నమ్ముటయా? నమ్మకపోవుటయా? గ్రీకులే యిట్టికుయుక్తిని బన్ని ద్వారమును దెఱపించుచున్నారేమో? ఎప్పుడయిన నిట్టిపని తొందరపడి చేయరాదు. (ప్రకాశము) వార్తాహారీ! మీరాజును సేనలును మాకోట ప్రాకారము నెక్కినచో నగపింతురు కదా!

ప్రతీ—దేవా! దక్షిణప్రాకార మెక్కి కుడివంకఁ జూచినచో మారాజుగారి యెఱ్ఱపట్టుగుడారము కన్పట్టును.

చంద్ర—సరియే. రమ్ము. నాకు వారింజూపుము.

ప్రతీ—చిత్తము రండు.

చంద్ర—వేగులవాఁడా! నీపనిపయి నీవు పొమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము—గుడారముబయలు.

(సెల్యూకసు - అంభీరుఁడు ప్రవేశింతురు.)

సెల్యూ—(తనలో)ఈరాజును లోఁబఱచికొనినయె డల నితరరాజు లందఱు మనకు లోఁబడియేయుం దురు. వీఁడుకూడ శౌర్యంబు దక్కి చంద్రగుప్తు నిచే నోడింపఁబడియున్నాఁడు. నాకూఁతును వీనికి చ్చి పెండిలిచేసినయెడల ననాయాసముగా హిం దూరాజ్యరమ యంతయు నాకుదక్కును. వీనికి సహాయముచేయుమిషమీఁదఁ జంద్రగుప్తు నో డింపవచ్చునుగదా! (ప్రకాశముగా) తక్షశిలా ధిపా! విచారమందకుము.

గీ. అకట! చింతిలనేల జయాపజయము
లరసి చూడ దైవాధీన మంద్రు బుధులు
ఇంత యేటికి నీ విపు డేఁగితేని
పడయుదువుకాదె విజయంబు పార్థివేంద్ర! 24

అంభీ—గ్రీకుసార్వభౌమా! ఆచంద్రగుప్తచండాలుఁ డు నన్నెంతంగా నవమానించినాఁ డనికొనినావు.

క. అని విడచి పాఱిపోవఁగ
వెనుదగిలెను “పాఱుఁబోత భీరుఁడ” యని నే
వినరానిమాట లివి యవి
యన నేటికి? దెప్పిపొడిచె నందఱముందున్. 25

సెల్యూ—కానిమ్ము. నీ విప్ర దండుల కేమిప్రతీకా రము చేయ నిశ్చయించితివి? చంద్రగుప్తుఁ డిప్పు డుకొలఁదిసైన్యముతోఁ గోటలో నున్నాఁడు.

అంభీ—హతశేషమయిన నాసైన్యమిప్పటికి రమా రమి యయిదువేలకు మించియుండును. మీసేన నలువదివే లున్నదికదా! మనమిరువురము గల సి నేఁడే కోట ముట్టడింతము. వారును జేయునది లేక మనకు వశులగుదురు. మనకు విజయం బు లభించినవెంటనే బయలుదేఱి శతద్రూనదీ ప్రాంతమునఁగల చంద్రగుప్త దుర్గ మాక్రమించు కొందము.

క. అది మీకు బహుమతిగ ని
చ్చెద, కప్పం బేను మీకుఁ జెల్లించెద స
మ్మదమారఁగఁ బ్రతియేఁటను
విదితముగా నాదుపల్కు విని నమ్ముఁ డికన్. 26

సెల్యూ—సెబాసు! అంభిరరాజా! నీపల్కులు విని కడు సంతసించితిని. ఇంక నీదుర్గము నేఁడే మనము ముట్టడింతము.

అంభీ—ఇప్పుడు నే ధన్యాత్ముఁడ నయితిని.

సెల్యూ—ఇదిగో! నాప్రతిజ్ఞ వినుము.

చంపెదను జంద్రగుప్తుని

జంపెద నే వాని సైన్యసంతతి నెల్లన్
నింపెదను గీర్తి నల్లని
లింపులుసయితంబు వాః! బలే! యని మెచ్చన్.

అట్టి రాజ్యంబుగెల్చి దానినంతయు నీకిచ్చెదనని కత్తి వట్టి ప్రమాణము చేయుచున్నాను. అంతియే గాక మద్వంశపావనియు నాముద్దులబిడ్డయునగు శోణోత్తరనుగూడ నీకిచ్చి వివాహము చేసెదను. నీ వింక విచారము దక్కియుండుము. నామాటలనెల్ల విశ్వసింపుము.

అంభీ — సెల్యూకసుమహారాజా! నీ కల్లుఁడ నగుదు నని విని నేను ధన్యుఁడ నయితిని.

గోపాలుఁడు — (ప్రవేశించి) దేవా! జయము జయము.

సెల్యూ — ఓరీ! విశేషమేమి?

గోపా — దేవా! రాయమల్లుఁడు తనసైన్యములతో వచ్చినాఁడు. నేఁటియుదయముపదిగంటలకుఁ గోటలోని కేఁగినాఁడు.

సెల్యూ — ఏమేమీ? వాఁ డిచటి కెందులకు వచ్చినాఁడు? మనము వచ్చినసంగతి వాని కెట్లు తెలిసినది.

గోపా — చంద్రగుప్తునిసహాయార్థ మిరువదివేలకాల్బలముతో వచ్చి కోటలోని కేఁగుచుండఁగా నిప్పు

డే నేను జూచివచ్చితిని. కర్తవ్య మూహింపుఁడు.

సేనా—ఓరీ! నీవు కన్నులార వానిని జూచితివా?
కాశ్మీరరాజేనా!

గోపా—దేవా! చూచితిని. అతఁడు కాశ్మీరాధి
పతియగు రాయమల్లుఁడే.

సెల్యూ—సరియే; ఇప్పుడు వచ్చినచిక్కేమున్నది?
మన మిప్పుడు కోటలోనికిఁ జొరఁబడుట మాని
ముట్టడింతము. లోనివారికిఁ దినుబండారము
లందకుండఁ జేయుదము. ఇట్లొకటిరెండురోజు
లు చేసినయెడల వారే మనకు లొంగుదురు.
ఓరీ! నీవుపోయి కోట పయినుండియే ముట్టడిం
పవలయునని నాయాజ్ఞగాఁ జాటింపుము.

అంభీ—సెబాసు! గ్రీకురాజా! నీయుపాయంబు కడు
మెచ్చఁదగియున్నది. నాసేనలనుగూడ సన్నద్ధపఱి
చెదను. నాకు సెలవా?

సెల్యూ—అందఱము పోవుదము రండు.

(నిష్క్రమింతురు.)

---

శ్రీ ర స్తు.

# న ం ద వ ధ ము.

---

## చ తు ర్థాం క ము.

(పేరిశాస్త్రి, రామావధాని ప్రవేశింతురు.)

పేరి—ఓహోహో ! రామావధాన్లు బావగారా ! న మోనమః.

రామా—చిరంజీవి సుఖీభవ ! ఏమోయి పేరిశాస్త్రుల్లు! ఎక్కడనుండేమిటి రావండ ! ఈప్పూళ్లో విశేషా లేమి ?

పేరి—బావగారూ ! తమరీప్పూళ్లో లేరాయేంటి ? వి శేషా లవుగుతున్నారు.

రామా—అయ్యో ! లేనోయి నెల్లాళ్లకిందటే బయ లుదేరి గ్రామాంతరం వెళ్లేనుకాదా !

పేరి—అయితే అంభీరరాజుగారు చచ్చిపోవడం సంగ తి మీాకు తెలియనే తెలియదు.

రామా—అబ్బే ! నాకేం తెలుసును. చెప్పు చెప్పు విం టాను.

పేరి—చంద్రగుప్తుడొచ్చి యీాప్పూరు ముట్టడించాడు. ముట్టడిస్తే మనరాజు యుద్ధంచేసి పారిపోయి యె వళ్లోదొరలట ! వాళ్లనిపట్టాడు.

రామా—మనం మెరగని అంభీరుడా యేంటి ? ఆమహా రాజు చంద్రగుప్తుడితో యుద్ధం చెయ్యడానికి ఎవడబ్బశక్యమయ్యా ! అత డెంతమంచివాడనుకున్నావు.

పేరి—అంతటలో కాశ్మీరరాజు చంద్రగుప్తుడికి సాయంవచ్చాడు. ఆదొరలు అంభీరుడుకలిసి మళ్ళా కోట ముట్టడించి, రెండురోజులు లోపలివాళ్ళ కేమీా వెళ్ళకుండా చేశారు. ఇంతటిలో వసంతుడట ఎవడో వచ్చి ఈదొరలని వెనకనుంచి కొట్టడం మొదలుపెట్టేడు. ముందునుంచి వాళ్లూ, వెనకనుంచి వీళ్లు కొడుతూవుంటే మధ్యనుదొరలు చిక్కడ్డారు, అంభీరుడు చచ్చిపోయాడు. దొరలు పారిపోయారు.

రామా—వా ! మామంచిరద్దీగా జరిగిందే యుద్ధం. దానికేమి. నువ్వెక్కడికి వెళ్తున్నావు.

పేరి—పెద్దినాయుడింట్లో పెళ్లికాదుటండీ ! ఇప్పుడు. పెళ్లి చేయించడానికి వెళ్తున్నాను.

రామా—అయితే నేనుగూడావస్తాను పదండి.

(ఇది విష్కంభము.)

---

రంగము - సౌధము.

(చంద్రగుప్తుఁడు - వసంతుఁడు.)

చంద్ర—మిత్రమా! వసంతా! నీవు నిజముగా నాకు మహోపకార మొనరించితివి సుమా!

క. విజయం బేమగునో యని
గుజగుజ లాడికొనుచుండఁ గూరిమితో నీ
వుఁ జనుచు ముదమున నొసఁగితి
విజయము నిన్నే మటంచు వినుతింతు నిటన్. 28

వసం—సంగడీఁడా! ఇందేనొనరించిన దేమున్నది? ఇదియంతయు నార్యచాణక్యాశీర్వచనప్రభావము సుమీ! అట్లు కాదేని.

క. వేనకువేల్ మించినయా
సేనాసాగర మదేడఁ! జిన్న బలముతో
నేనేడ గెల్చుటేడను
ధీనిధి చాణక్యఋషులదీవనసుమ్మీ! 29

చంద్ర—మిత్రమా! నీవు వెనుకనుండి వచ్చియుండుటచే బాగుగాఁ బరికించియుందువు. ఆవంకఁబట్టుగుడారము లెవ్వారివిడిది యయి యుండెడివి?

వసం—సఖా! గ్రీకుసేనాధిపతియగు సెల్యూకసు తన యవరోధజనంబులఁగూడఁ దీసికొనియే వచ్చుచున్నాఁడు. ఆగుడారము వానియొుఁడువాండ్రకౌ

యి నిర్మింపఁబడినది. అందు వారుండెడివారు.

చంద్ర—(తనలో) నాయభిప్రాయమెట్లు వసంతుని తో విశదీకరింతును. విశదీకరింపకున్న నాకో రిక నెఱవేఱుటెట్లు? ఇందులకు వసంతుఁడు సమ్మతించునో సమ్మతింపఁడో! ఇతఁడు సమ్మతించిన నార్యచాణక్యఋషి యిందులకు సమ్మతించు నా! ఇప్పుడు నే నేమియొనర్తును.

వసం—సంగడీఁడా! నీలో నీవేమో యాలోచించు కొనుచున్నావు. ఏకారణముచేతనోగాని ఖిన్నుఁ డవయి యున్నట్లుగూడ నున్నావు. ఆకారణం బేదియో నాతోఁ జెప్పెదవా!

చంద్ర—చెలికాఁడా! విజయలక్ష్మిపరివృతుండ న గు నేను ఖిన్నుఁడ నయియున్నానని పల్కుట లో నీవు మిగులఁ బొరపడితివి సుమా!

వసం—పొరపడినానా! అవును నీ వట్లనుటలోఁ ద ప్పేమి? ఆ గుడారమునం గలవా రెవ్వరని నీవు తొలుతఁ బ్రశ్నించి, గ్రీకులరాణివాసమని తెలి సికొనినపిమ్మట నిట్లు వెచ్చనూర్పుల నూర్చు చుండునిన్ను ఖిన్నుఁడవయి యున్నాఁడ వనఁదగు నా! విరహివయి యున్నావనిన సరిగనుండును.

ంద్ర—చాలు. నీపరియాచకము.

వసం—పంయాచకములు కావా! దానికేమి గాని సంగడీఁడా! నీమనంబుఁ జూఱఁగొన్న యాయంద కత్తె యెవతె! ఆసంగతి నాకించుక దెల్పుము. అట్లు చెప్పకున్నచో నాతోడేసరి.

చంద్ర—సంగడికాఁడా! నీవిట్లాన వెట్టుచుండ నిజము చెప్పకపోయిన యీదోషమంతయు నాదే. నిజము చెప్పెద నాకర్ణింపుము. ఇరుకునఁ బడి గ్రీకుసేన చెల్లాచెదరయి పాఱిపోవుచుండెను. వారిని వెంటఁదరుమ నేఁ బోవుచు గుడారమువంక కేఁగితి. గ్రీకులు పాఱిపోవుటకయి గుడారము లెత్తుచుండిరి. అప్పు డాగుడారములోనుండి యొక కాంతామణి బయటికి వచ్చినది. అయ్యారే! ఆకన్నెమిన్నసొబ గేమని చెప్పవచ్చును.

సీ. కలదు లేదనునట్టి కౌనుదీవియ గాంచి
కాంచ నక్కఱలేదు గగనసీమ
సొగసు గుల్కెడినవ్వుమొగముతీరు దలంచి
తలఁప నక్కఱలేదు కలువఱేని
పసలు గ్రమ్ముచునుండుమిసిమివేనలి నెంచి
యెంచ నక్కఱలేదు భృంగములను
నిగనిగలాడుకన్నుఁగవను గనుఁగొని
కన నక్కఱయె లేదు కంజములను

తే. తళతళల నీనుచెలిమిన్నతనువు నెంచి
యెంచనక్కఱలేదు సూ మించుమాట
యింతయేటికి దాని వర్ణింతుమేని
పలుకనక్కఱలేద యప్సరలఁ గూర్చి. 30

సంగడీఁడా! ఏమా మందయానయందము.

చ. నిగనిగలాడుకూర్మములు నిల్కడ గాంచినమిం
చుఁ దీవ సం, పెఁగకుసుమ్ములన్ వలచుభృంగచ
యంబులు కంధిలేనియూ, పగడము లింతవింత
లగుపల్కులు నేర్చిన పైఁడిబొమ్మ మా,దగజవి
లాసయానసరినారులు లేరు ధరాతలంబునన్. 31

ఆకాంతామణిని గాంచిన దాది నామనంబు మరల్ప వశంబుగాక యున్నది. నీమాటలఁ బట్టిచూడ నాపె సెల్యూకసునికుమార్తెయయి యుండనోపు.

ప్రతీహారి—(ప్రవేశించి) చండతరదోర్దండవిజితాఖిలమహీమండలాధిపా! చంద్రగుప్తసార్వభౌమా! జయము జయము. దేవా! నే నార్యచాణక్యునిసందేశంబు గొని తెచ్చియున్నాఁడను వారు మీకిమ్మని చెప్పి యీలేఖఁ బంపియున్నారు. చిత్తగింపుఁడు.

చంద్ర—ఓయీ! ప్రతీహారీ! పాటలీపుత్రమునఁ జాణక్యమహర్షిసత్తముఁడు సుఖముగ నున్నారు

కదా! మావిజయమునుగూర్చి వారికి వార్తలు వెంటవెంటనే తెలియుచున్నవా? అచ్చట నేమైన విశేషములు కలవా యేమి? సఖా! వసంతా! దీనిని జదువుము.

వసం—చిత్తము. (అని చదువుచున్నాఁడు.)

"వత్సా! మౌర్యవంశోద్ధారకా! నీవు మాయాజ్ఞానుసారము తత్క్షణము తక్షశిలకుఁ జనినావనియు, సందంభీరు నోడించినావనియు విని మిగుల సంతసించితి. గ్రీకులుకూడ సంభీరునకు సహాయపడ వచ్చినప్పుడు రాయమల్లుఁడు నీకుఁ దోడ్పడినాఁడనియు వినినాఁడను. రెండవవిజయమువ వసంతునిసాహసము వర్ణనాతీతము. అంభీరునిమృతి కాతఁడే ముఖ్యుఁడు. సెల్యూకసు నీచే నోడింపఁబడి నందకటకమునకువచ్చి నందునకుఁ దనకుమార్తె నిచ్చెదననియు వానికి నీతో యుద్ధముచేసెదననియు వాగ్దానము చేసినాఁడఁట! కాన నీవు వెంటనే నందకటకమునకుఁ బోయి మహాపద్మనందుని, సెల్యూకసునుగూడ నోడించి కృతవిజయలక్ష్మీకరగ్రహణుండ వగుటయేకాక, సెల్యూకసుకుమార్తెయగు శోణోత్తరనుగూడఁ బరిగ్రహించినవాఁడవగుము. నే నిటనుండి బయలువెడలి నిన్ను నందకటకమందుఁ గలసికొందును."

పాటలీపుత్రము }
శ్రావణ బగ్గలు } చాణక్యుఁడు.

మిత్రమా! ఇంకేమి? నీమనోవాంఛ లన్నియు నెఱవేఱఁగలవు. వెంటనే బయలుదేఱి నందకటకమున కుఁ బోవుదము.

చంద్ర—వసంతా! ఆ చాణక్యునిదయామృతము మనపైఁ బ్రసరించుచుండవలయును కాని మన కోరికలు నెఱవేఱుట కేమియాశ్చర్యము.

వసం—సంగడీఁడా! నీలోకమంతయు నాకుఁ దెలియును. మనము ప్రయాణమగుట యాలస్యమయినచో వారు సర్వసన్నద్ధు లగుదురు. అప్పుడు గోరఁజీరునది గొడ్డలితోఁ జీరవలయును. కాన ప్రయాణభేరి మ్రోఁగింప నాజ్ఞాపించెదను. రమ్ము మనము పోవుదము.

(నిష్క్రమింతురు.)

---

రంగము - సౌధము

(పద్మనందుని ప్రవేశము.)

పద్మ—చ. తనయులనెల్ల మ్రింగి వసుధాసురుచేఁ గడుఁ బేరు దక్కె భీ, రునిగతిఁ బొట్టతిండి కిసిరోయి ప్రాంతముఁ జేరినాఁడ నె,మ్మనమునఁ దాపమా?

ననుమానము తీఱెను జంద్రగుప్తునిఁ, దునిమెద
గ్రీకుసాయమునఁ దోసము నా కపుడే లభించె
డిన్. 32

ఉ. గ్రీకులసాయ మున్న నెవరిఁ సమరంబునఁ దాఁక
లేను దా, నేకడ కేఁగునో కనెద నెవ్వరు వానిని
గాచువార లిం, కాకతినుండు చావవలె నబ్బినిజో
చ్చిన వీఁడువాఁడనా!, యీ కరవాల మూని
వధియించెద గ్రద్దకుఁ దిండి వెట్టెదన్. 33

"ఏకా క్రియా ద్వ్యర్థకరీ బభూవ" అనినట్లు నా
కిప్పుడు రెండులాభములు లభించును. తిరుగ మగధ
రాజ్యంబు నాకబ్బుట యొకటి. రెండవది, సెల్యూకసు
నికుమార్తెను నాకిచ్చి వివాహముచేయుట. అతఁ
డు మనస్ఫూర్తిగా వివాహము చేసెదనని చెప్పి హా
పపటము నా కిచ్చినాఁడే? అయ్యారే! ఈ యొ
య్యారియంద మెంతమనోహరముగా నున్నది.

క. దరమా! గళ మారయఁ గం
ధరమా పెన్నెరులగుంపు తరుణీమణిసుం
దరమాధురిన్వన మెన్నఁ
దరమా హరికైనఁ జంద్రధరునికి నైనన్. 34

ఆయంగనామణిసింగారంబు వర్ణింప నేరితరము?
కాని; చెలికత్తెలపల్కులు వినిన శోణోత్తరకు నాప

యు వలపులేనట్లు స్పష్టమగుచున్నది. ఏమిది ? నేనుమా త్రము రూపసిని గానో? ముసలివాఁడనా ! మొన్న నే కదా ! నాకు నలువదియవయేఁడు దాఁటినది. ఒ క్క సామ్రాజ్యంబు లేక యున్నాఁడనుగాని, ఇంక నా కేమింటఁ గొదువ ! మగధసామ్రాజ్యాక్రమణానంత రమున సెల్యూకసు నాకే బలవంతముగాఁ బెండ్లిచే యఁడా ! సెల్యూకసే కాఁబోలు వచ్చుచున్నాఁడు.

సెల్యూకసు—(ప్రవేశించి) మిత్రమా! పద్మనందా ! భావికాలమగధచక్రవర్తివి కదా! ఇప్పుడు రాఁ బోవు విపత్తునుగూర్చి నీయుద్దేశమేమి ? బాగు గా నాలోచించి చెప్పుము.

పద్మ—సఖా ! ఇప్పుడు వచ్చినవిపత్తేమి ? సమయ ముకానిసమయమున నిట్టిపు వచ్చుట చూడన శ్చర్యదాయకముగా నున్నదే !

సెల్యూ—చంద్రగుప్త, రాయమల్ల, వసంతులు వచ్చి నందకటకమును దమసేనలతో ముట్టడించినారు

పద్మ—ఏమేమి ? వారిచ్చటికివచ్చి ముట్టడించినారా ఇప్పుడే మన సేనల నన్నిటినిగూడ యుద్ధసన్నద్ధు యి యుండుఁడని చాటెంతము. మనముకూడఁ ఉ త్సన్నాహములమయి యుందము. సఖా ! నా న్నినాళ్లకుఁ జేతులకేఁటపోవునట్లు యుద్ధంబబ

నని మిగులసంతోషముగా నున్నది. ఎక్కటికయ్యంబున నాలావంతయుఁ బ్రకటించెదను. ఆలస్య మేటికి ?

చ. కొడుకులనెల్ల గూఢముగఁ గూల్చినకూళలవాఁ
జిఁ జంపి యి, వ్వడు రిపురక్తధారలను మోద
ముతోడుతఁ దర్పణమ్ము నే, విడిచెద వారికెల్ల
నృప భీరుని గూరుని జందిగుప్తునిన్, గెడ
పెద రాయమల్లనృపు గెంటెద నొంచెదనావ
సంతునిన్. 35

సెల్యూ—పద్మనందా! నీకు విజయమగుఁగాక! కాని, వారలసైన్యంబు మిగులఁబెద్దదిగాఁ గన్పట్టుచున్నదే ? మనయిరువురిసైన్యంబులుగూడ నలువది వేలకు మించియుండవు. వారికి దాదాపుగానెను బదివేలవఱకున్నట్టుగాఁ గన్పట్టుచున్నది. కావున మనమేదేనియుక్తిపన్ని వారి నోడించవలయును.

పద్మ—ఏటికి నీ విట్లధైర్యపడుచున్నావో కాని నాకెఱుంగరాకున్నది. సర్వదేశాధీశులఁ గయ్యంబునఁ దెగటార్చి విఖ్యాతి గాంచినమహాపద్మనందుం డీపాటిచిన్నసేనకు జంకునా! కృతిమోపాయంబులచే విధి యనుల్లంఘనీయ మగుట నాకీనందకటకమునకుఁ బోవలసివచ్చెను. కానిమ్ము

నన్ను నాఁడట్లు చేసినచాణక్యచండాలుని నేఁటి కయ్యమునఁ దెగటార్చెద. నందవంశ మంతరిం చువఱకును నాకూర్రుఁడు శిరోజములు ముడి వెట్టఁడఁట! వాని జీవములతోఁ బట్టి బంధించి గోఱగోఱ వానిబుఱ్ఱగొఱిగించి నాకోపము తీ ర్చికొనెదను.

సెల్యూ—సరియే! రమ్ము. సేనల సిద్ధపఱుతము.

(నిష్క్రమింతురు.)

---

రంగము - యుద్ధభూమి.

(చంద్రగుప్తుఁడు, వసంతుఁడు, పద్మనందుఁడు, సెల్యూకసు)

చంద్ర—ఓరోరి! మహాపద్మనందా! ఇదియాలము కాని, కుత్సితమతివయి మౌర్యులను జంప ని శ్చయించుట కాదు.

పంచ. బలంబుచేతఁ బెక్కుదేశపాలురన్ వధించిభూ
తలాధినాథబృంద మెల్ల దాసులై చెలంగ ను
జ్జ్వలత్ప్రతాపుఁడై ననన్నుఁజంద్రగుప్తగామదిన్
దలంచికొమ్ము చావకుండఁ దప్పికొమ్ముపొమ్మిఁకన్

వసం—ఓరి! నందా!

పంచ. ఘనుండు క్రూరరాజవర్గకంఠలుంఠనుండ తం,

డనంగ మూతిమీఁద మీసమైననున్న చోనెదు,
రోఁకనంగ రమ్ము గ్రీకువారుకూడ నుండిరంచ
హాహా, పెనంగఁబోయితేని మేను వీడువాఁడవ
య్యెమో!. 37

సెల్యూ—ఔరా! వదరుఁబోతా!

ఉత్సా. కారులేల ప్రేల నింకఁగడఁగి మీవిభుండుమా,
భూరమణునితోడ యుద్ధమునకువచ్చువాఁడొకో
బీరముచెడి మూలనుండి పిరికిపడెడివాఁడొకో
ఔర!ముందు చెప్పు మాకునంతెచాలుదుర్మతీ!.

మహా—భుజం. అరే చాలుఁ జాలించరా నీదుకారుల్
హరుండైనఁ గాని మ్మిఁకారాజుఁ దాఁకన్
దరం బౌనె ఛీ! యీవృథా మాట లేలా?
దురమ్మందు వేన న్నెదుర్కొమ్ము మూఢా!

(తెరలో ఫిరంగులు ప్రేలును)

---

పంచచామరములు.

చంద్ర—దురాత్మ! చాలునిల్వు మింకఁ ద్రుంచువాఁ
డ నిన్నిదే, శిరమ్ము గూల్చి దాని భూమిఁ జేర్చు
వాఁడ బాలిశా!

సెల్యూ—బిరాన పాఱిపోయితేని వీడువాఁడ నీకిదే
కరంబుమేలు లేకయున్నఁగంఠమున్ వధింతురా!

వసం—దురమ్ము చేయ నెంచెదేని దోర్బలమ్ము చూపి
సం, గరమ్మునందు నిల్చి పోరఁగా యశమ్ము
హెచ్చుగుః.
పద్మ-నరాధిపాధమాధమా! ఘనమ్ముగాదు ప్రేలినః
సరేజయింతుగాని నీదుశక్తి కొంత చూపుమా!
చంద్ర—ఘనుండుఁబోలె మాటలాడఁగాఁ దొడంగె
దియ్యదే,నినుః క్షణంబులోనఁ ద్రుంతు నిల్వ
పాఱిపోకురా!
సెల్యూ—జనావళుల్ నుతింప నిన్నుఁ జంపువాఁడ
నీ కిదే, వినాశకాల మావరించె వెఱ్ఱి యోడ
కింకిటః.
వసం—బలంబు చూపుమంతె కాని పౌరుషంపుమా
టలః, చలంబుతోడఁ బల్కనేల చాలు సంత
సించితిః.
మహా—విలంబమేల చేయ నీకు వేగిరమ్ము పోరికిః
బలంబు రూపుమాపి భూమిపాలునిన్నుఁ జేసెదః
చంద్ర—దురాత్మ! యిద్దె నిన్ను నేను ద్రుంచువాఁడఁ
గాచుకో
సెల్యూ—శరంబు వేయుచున్నవాఁడఁ జచ్చినావు
చూచుకో
చంద్ర—భరంబు దీనిఁ గాయనీకుఁ బాఱిపోక తప్పకో

పద్మ--శరమ్ము వచ్చెదాని కింకఁజచ్చిపోక మేలుకో.

వసం—ఓరీ! వాచాటా! వృథాగర్వాటోపా! ఏమి ప్రేలితివిరా!

(దవడలు నొక్కి లోనికి లాగుకొని పోవును.)

(తెరలో పెద్దకలకలము - ఫిరంగులు పేలును. హా! సెల్యూకసూ! చచ్చితి! చచ్చితి! రక్షించుము.)

సెల్యూ—సఖా! ఇదే వచ్చుచున్నాను.

(నిష్క్రమించును.)

---

చంద్ర—నేనును నీవెంటనే వచ్చెదను.

(నిష్క్రమించును. తెరలో ఫిరంగులు పేలును.)

(తిరుగఁ జంద్రగుప్త, వసంతులు ప్రవేశింతురు.)

చంద్ర—సంగడీఁడా! ఇందు మనకే విజయ మబ్బిన ది. ఆర్యచాణక్యునిదర్శన మొనర్చుకొందము. రమ్ము.

వసం—సఖా! చాణక్యబుష్యాశీర్వచనములోఁ దొలిదైనది. ఇంకను రెండవది మిగిలియేయున్నది కదా! అది స్వయముగాఁ జేసికొనుము.

చంద్ర—నీవేళాకోళము చాలును. రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు)

---

రంగము - మంటపము.

(చంద్రగుప్తుఁడు, వసంతుఁడు, చాణక్యుఁడు, సెల్యూకసు)

వసం—మిత్రమా! చంద్రగుప్తా! ఇన్నినాళ్లకు గిరికులజయించి మగధరాజ్యాభిషేకమునంద సిద్ధుండవయియున్న నిన్నుఁ గాంచుభాగ్యంబు నాకుఁ గల్గినది. ఇదియంతయుఁ జాణక్యునియనుగ్రహము సుమీ!

చంద్ర—అభ్యంతరమేమి? అయ్యనఘుఁడే నాయభ్యుదయమునకుఁ బ్రథమకారణము.

చాణ—వత్సా! నాప్రతిజ్ఞలు పరిపూర్తిఁజెందినవి. ఇంక నీవివాహమహోత్సవమొక్కటియుఁ బట్టా

భిషేకమును నేను జూడఁదగినవి. ఇదేనిన్ను మగధరాజ్యాధిపతినిగాఁ జేయుచున్నాను.

(కిరీటము శిరముపైఁ బెట్టును.)

సెల్యూ—మహారాజా! చంద్రగుప్తసార్వభౌమా! నాకుమార్తెయగు శోణోత్తరను మీకిచ్చి వివాహము చేసెదను. తమ రందుల కియ్యకొనవలయును.

చాణ—కుమారా! తప్పక నీవనినట్లు చేయవలసినదనియే నాయభిప్రాయము.

చంద్ర—గురువులయాజ్ఞ తలఁదాల్చుచున్నాను.

చాణ—వత్సా! ఇంక నీకేమయినను గోరికలుగలవా!

చంద్ర—నాకింకేమి కావలయును. అయినను లోకోపకారార్థ మిట్లగుఁగాక!

భరతవాక్యము.

గీ. ధరను శ్రీశారదాలాడ్జి యురుతరయశ
మును గడించుత సుకవులకును యశంబు
గలుగుఁగావుత మీకృతి యిలను వెలయుఁ
గాత సస్యముల నొసంగుఁ గాత భూమి. 39

మఱియు,

గీ. అవని గోబ్రాహ్మణులకు సౌఖ్యమగుఁగాక
కవులకెప్పుడు సత్కీర్తి గలుగుఁ గాక
అబ్జహితశశిభము లుండునంతదాఁక
వసుధ మామకసత్కృతి వఱలుఁగాక. 40

చాణ—అట్లే యగుఁగాత.

(అందఱును నిష్క్రమింతురు.)

(తెర దిగును.)

సంపూర్ణము.

---

# శారదా గ్రంథమాల.

"విద్యావిహీనః పశుః" అనునార్యోక్తి యెంద అచేతను శిరసావహింపఁదగినదే కదా! ప్రస్తుతము మనదేశ మెట్లున్నది? అన్ని దేశములకన్న విద్యలో మిగుల వెనుకఁబడి వన్నెతఱిఁగి యున్నది. ఇట్టికాలమునఁ బ్రతివారును వారిచేత నగుసహాయమును జేసి భాష నుద్ధరింపవలయును. భాషాభివృద్ధితోపాటు విద్యాభివృద్ధియు, అందువలన దేశాభివృద్ధియు నగును.

"గీ. విద్య యొసఁగును వినయంబు వినయమునను
బడయుఁ బాత్రతఁ బాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు."

కావునఁ బ్రతిపనికిని విద్య యత్యావశ్యకము. అదేమిపాపమో కాని నేఁటికాలమున గ్రామ్యభాష యొకటి బయలువెడలి మనభాష నడుగంటఁద్రొక్క యత్నించుచున్నది. మనము దానియుద్రేక మడఁప యత్నింపవలయును. ఇప్పట్లు మన మొనరింపవలసినవని యనేకగ్రంథములు వెలువఱుచుటయే. అట్లు చేయుటయే కాక అందఱి కందువిడిలో నుండునట్లు వెలలు తగ్గించవలయును. అనేకు లిట్లు గ్రంథములఁ

ప్రచురించుచుండ మేముకూడ నిట్లు చేయుట ఉచితసహాయమే. ఇప్పుడు, వారలకు మనము తోడ్పడితిమేని కొంతయభివృద్ధి యగు ననియె మాతాత్పర్యము. అదియే మాగ్రంథమాల స్థాపించుటకు ముఖ్యకారణము.

ప్రకృతాంశము విడచి చాలదూరము వచ్చితిమి. ఇందు ముఖ్యముగా భాషాభివృద్ధికిఁ దోడ్పడు నాటకములు, నవలలు, ప్రహసనములు, ప్రబంధములు ప్రచురింపఁబడును. నాతికఠిన మయి నిర్దుష్టమగు శైలిని చక్కనిగ్రంథములు వ్రాయఁబడును.

చందాదారులకు రు. 1-0-0. శాశ్వతచందాదారులకు రు. 2-0-0. సహాయులకు రు. 5-0-0. పోషకులకు రు. 10-0-0 చందా నిర్ణయించితిమి. శాశ్వతచందాదారులకు సహాయులకు పోషకులకు చక్కని క్యాలికోబైండుచేసినపుస్తకము లీయఁబడును. ఇందుకు ప్రవేశరుసుము నాల్గణాలే. ౩౦౦ పుటలకు తక్కువకాని గ్రంథములు వెలువడును. అన్యులకు 0-6-0ల కిచ్చునవి చందాదారులకు 0-4-0కే యీయఁబడును. చందాధనము మిగుల స్వల్ప మగుటచే ఏపుస్తకమున కాపుస్తకము, వీ. పీ. పంపిన లాభము లేదు. కాన చందా ముందనిపిన మంచిది.

అటుకాక యేపుస్తకమున కది వీ. పీ. పంపుఁడనిన ఖర్చులు వారే భరింపవలయును. చందాదారులకను బంధగ్రంథములు వలయునెడ పోస్టేజీ మేమే భరించి అసలువెలలకే వారల కంపెదము. విద్యాభిమాను లందఱు మాకు తోడ్పడెదరని ప్రార్థించుచున్నాము.

---

## అనుబంధగ్రంథములు.

| | |
|---|---|
| పార్థసారథి శతకము | 0-1-0 |
| భుజంగ హితోపదేశము (వేశ్యలమాయలు బాగుగా వర్ణింపఁబడినవి) పుష్పబాణవిలాసము. (శ్లోకములు, పద్యములు.) | 0-2-0 |
| బుద్ధోత్పత్తి (చదివి తీరవలెను.) | 0-1-0 |
| ప్రభాకరవిజయము. (చక్కనినాటకము.) | 0-8-0 |

---

## గ్రంథమాలాగ్రంథములు.

2 మోహనవతి. (ఆఱంకములనాటకము.)

ఇది మామాలలో ద్వితీయకుసుమము. అందఱి కాఱణాల కిచ్చుచున్నను మాచందాదారులకు నాల్గణాలకే యిచ్చుచున్నాము. పతివ్రతచరిత్ర. నాతి కఠినమగు శైలి ద్రాక్షపాకము. మాగ్రంథ ప్రాసస్త్య

మును గూర్చి మేము పొగడుటకన్న చదివిచూచిన మీకే తెలియును. శైలికయి యీ దిగువపద్యము చదివి చూడుడు.

"సీ. కడు దీనపడి చాన నడుకానఁ బడి నూన
ముగ నెంతలేసి బాములను బడితో
"నను మాని" నని లేనియనుమానమునుబూని
ఘనవేణి నీవెంత వనటఁ బడితో
మగఁడంచును గణింపఁ దగమంచివగ నించె
నని యెంచి యెంతయాయాసపడితో
కన ఘోరవనవారమును నారి ! కని ధీర
తను మాని యపు డెంతదద్దరిలితో
గీ. కటకటా ! మోహనవతి ! ముచ్చటలసుదతి
రతికి రతిఁ గొల్పుసతి గుణవతి మనోహ
రాంగములఁ గలయువతి కాయజునిదంతి
యెట్లు నిను మాని జీవింతు నింకమీఁద."

---

## 3 దేవేంద్ర పరాభవము (నాటకము).

కీర్తిశేషులైన బ్ర. శ్రీ. దూర్వాసుల మార్తాండ శాస్త్రిగారిచే రచియింపఁబడినది. పారిజాతాపహరణముకథ. పరిదర్శకుల కుపయోగ మగునట్లు క్లుప్తపఱిచి వ్రాయఁబడెను. పంచదారచక్కెకాని ద్రా

శ్యప్రబంధము కాదు. ఈపద్యము చదివిన మీకే బోధపడును.

---

ఉ త్ప ల మా లి క.

గోపకులావతంస ! కఠుకూరిమిచే భవదీయభ్రూలతా, చాపవినిర్గతేక్షణనిశాతశరావళియుక్తిఁ జూపి యా, గోపికలన్ జయించి కుచగోపురము ల్గొని మారసంగరో, ద్దీపితశక్తిఁ జూపి కసిదీఱఁ గచాకచి పోరుసేయుటల్, నీపని కాని నా నెదుట నిల్చి శరోద్ధతిఁ జూపఁ జాలుదే.

---

## 4. సుగుణమణి (నాటకము).

ఇదియు శ్రీ మార్తాండశాస్త్రివిరచితమే. ప్రకృతకాలానుగుణ్యాంబగు శైలితో ముద్దులొల్కు పల్కులతో హృద్యములగు పద్యములతో చమత్కారమగు హాస్యముతో నిండియున్నది. వర్ణనలత్యద్భుతములు.

"సీ. పాతాళలోకంబుపర్యంతముఁ జొచ్చు
ధారుణీవివరంబు నోరు గాఁగ
భూమ్యంతరిక్షముల్ పూర్తిగా నించుకీ
చకనికాయము దంష్ట్రిచయము కాఁగ

సంధ్యారుణాలతాంతసంతాన మగ్నిహో
త్రంబు వర్షించునేత్రములు కాఁగ
పంక్తీకృతానేకబకరాజి మెడయందు
వ్రేలఁ గట్టినయస్థిమాల కాఁగ
గీ. పలువిధంబుల మృత్యుదేవతనుఁబోలి
నెగడునీవని హా! మన సుగుణమణిని
గొంతులో వేసికొననేమొ కొంపదీసి
కాకయుండిన నేఁడు నాకంటఁబడదె."

ఏజంట్లకు మంచికమీషను నీయఁబడును. వివరములు తెలిసికొనఁగోరువారు క్రిందిచిరునామాకు వ్రాయుఁడు.

మేనేజర్,
శారదాగ్రంథమండలి
మాడుగుల
విశాఖపట్టణము జిల్లా.

